శ్రీ రస్తు.

శ్రీశారదాంబాయైనమః.

శ్రీ తుంగదుర్తి బుచ్చయార్య సద్గురుయోగీశ్వర దివ్య

శ్రీ చరణారవిందాభ్యాన్నమః.

# దృష్టాంతనీతిపద్యములు తెలుగు.

| | |
|---|---|
| శతకమాలెపద్యములు ... ... ... | 128. |
| అర్పణయోపదేశగణిక ... ... ... | 21. |
| తర్పణజ్ఞానగణిక ... ... ... | 21. |
| హోమగణిక ... ... ... ... | 5. |
| శాంతి దస్యా మానశికము ... ... | 1. |
| కుల్లు. | 171. |

ఇది

గుంటూరుజిల్లా వంగోలుతాలూకా యండ్లూరిగ్రామ

కాపురస్థుడగు,

యండ్లూరి కోటయ్యచే రచియింపబడి

కొత్తపట్టణ నివాసులగు బ్రహ్మశ్రీ

గొల్లపూడి రామలింగ శాస్త్రులవారిచే

పరిశీలింపబడి

శ్రీ భవానీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపబడియె.

నెల్లూరు.

1912.

శ్రీరస్తు.

దివ్యశ్రీ చరణారవిందాభ్యాంనమః.

శ్రీతుంగదుర్తి బుచ్చయాఖ్యసద్గురుయోగీశ్వరదివ్యశ్రీచరణార

విందాభ్యాన్నమః.

౧. క॥ శ్రీలక్ష్మీశునివాణీమది। చాలన్నుతియించిగౌరి శంకర వినతుల్।
దేలించిభారతీశుని। మాలిమిగనునటులగొల్తు మనసార నిటన్॥

౨. క॥ విఘ్నములసర్వరాజై। విఘ్నాటవులందహింపవైశ్వానరుడై।
విఘ్నములబారదోలెడి। విఘ్నేశ్వరుగొల్తుకావ్య వితరణకోరకున్॥

౩. గీ॥ అవనియాధారపంచకాహ్వాయలనెన్ని। వినయమొప్పగవేత్తలవినుతిజేసి।
ఘనులగొనియాడిదైవత గణమునెన్ని। పండితులకొగ్గిసాధులబ్రస్తుతించి॥

౪. తే॥ అరయశ్రీవేమనార్యునియభినుతించి। బుచ్చయార్యునిమదిలోనపూజచేసి।
వారిశిష్యప్రశిష్యులనభినుతించి। గురునకునుమ్రొక్కిసుకవులగోరితలచి॥

౫. ఆ॥ నీతిశతకముదృష్టాంతనీతివెలయ। నమరరచియించిజానకీనాథుపేర।
నంకితంబిడియర్పించినానుదీని। దర్పణమురీతిదృష్టంబుదగులరామ॥

౬. తే॥ తప్పులనుచునెంచితగ్గియుండగరాదు। యొప్పులనుచునెంచియురకరాదు।
దారినేరుగడచిదరిజేరరేనరులు। రామరామసార్వభౌమరామ॥

౭. ఆ॥ మనసుకుదురజేసి మార్గంబుదృఢపడ। చెప్పినంతవినియుగొప్పజేసి।
తప్పులున్నసైచియొప్పుగావించుటలు। సాధుజనులధర్మసరణిరామ॥

దృష్టాంతనీతిపద్యములు.

౮. తే॥ విద్యయనగవ్రాయవిద్యగాదిలయందు। విద్యయనగచదువవిద్యగాదు।
విద్యయనగజన్మవివరంబుతెరుగుటె। రామరామసార్వభౌమరామ॥

౯. తే॥ పెద్దలయినవారిబుద్ధియోగ్యతలను। పెద్దదయినవారుపెద్దలగుదు।
బుద్ధిశుద్ధులులేకభుజియింపపెద్దలే। రామరామసార్వభౌమరామ॥

౧౦. తే॥ కౌనుయౌనుటన్నయదెయ్యదిదుస్తరము। కాదుకాదటన్నకాకపోను।
మంచియనుమానమగుమరిచెడుగుతథ్యమగు। రామరామసార్వ॥

# దృష్టాంతనీతిపద్యములు.

౧౧. తే॥ గజములీనుచుండుకడుకాలమునకొకటి। పందియీను నేటపదిపదారు।
జాతిబలములున్న జనుకీర్తులుండునా। రామరామసార్వ॥

౧౨. తే॥ అంచయుండియుండియుండ మొక్కటిబెట్టు। కుక్కుటములు సేయుగుడ్లు
కడుపుపండిన లెస్సగలకీర్తిపండునా। రామరామసార్వ॥ (హంస।

౧౩. తే॥ నరుడుపోరున చెడునునాచు చెచెడునీరు। వనిత చెడునుమానహానిచేత।
సాధుచెచెడునెంతసంపన్నులయినను। రామరామసార్వ॥

౧౪. గీ॥ చావునుద్దేసించిసాధు నేపోరనగు। జడుడుమృత్యునోటచేరియుండి।
జ్వాలజుట్టితిరుగుశలభమందినరీతి। తనలిచెడ డెనీచ ఖలుడురామ॥

౧౫. గీ॥ ఖలుడుజ్ఞానినిపోలికపటాత్ముడయ్యుండు। జ్ఞానివికటవృత్తిగాచెరించు।
జ్ఞానిఖలులనిజ్జముగనిచెరించునుసాధు। సాధునెరుగుదైవసముడురామ॥

౧౬. తే॥ తెలసినట్టివారు తెలుపరితిరులకెలమి। తెలసి తెలయనివారు తెల్పుచుండు।
నిజ్జమెరింగినతనకునితరమెప్పెలనో। రామరామసార్వభౌమరామ॥

౧౭. తే॥ సాధుకెప్పుడుతాపసంగ్రహంబెరాదు। వచ్చె నేనిదానికడ్డిలేదు।
జ్వాలబాడబమునుచేరు నేమానవులు। రామరామసార్వ॥

౧౮. క॥ సాధగనయోగసిద్ధుడు। సాధుసదానందమత్తుసర్వజ్ఞుడిలన్।
సాధననమాయకుండగు। సాధునుగమనింపయొరులసాధ్యమెరామ॥

౧౯. క॥ సాధెరుగున్నిన్నుసాధుల। సాధులనీవెరిగివెంట సేమచుందువిలన్।
సాధాసాధ్యములణిచియు। వాదికిడగిలించినొంచువాడవురామ॥

౨౦. తే॥ సాధుకిచ్చినయీవిసంపదలగలిగించు। యోగికిచ్చినయీవిభోగమిచ్చు।
నీచుకిచ్చినయీవినిర్భాగ్యమొసరించు। రామరామసార్వభౌమరామ॥

౨౧. తె॥ వద్దువద్దనువారికర్పింపనిష్ఫలము। యివ్వుమనినవారికిడుటసమము।
అడుగనట్టివారికర్పింపసఫలమగు। రామరామసార్వ॥

౨౨. గీ॥ దూరమున్నవాని దృష్టింపయోచించు। యొద్దనున్న దానియరుగలేక।
యొటనుండినరులుయొనుకముందరచూచు। కాలుక్రిందిగుంటగనునెరామ॥

౨౩. తే॥ ఘనులు చేసినుపనులగని [illegible]వక। కూర్మిరులందు డేరికుట నెరవు।
అట్టిక్రుటి[illegible]ను। రామరామసార్వ భౌమరామ॥

౨౪. గీ॥ అందమందునస[illegible]పయుగజారి। యందియందరానియధిక[illegible]ము।
పండు తెరగి[illegible]గాక ఖ్యులముఖ్యులను। నమ్మరాదుజగతియందురామ॥

౨౫. గీ॥ ఆకలైనవారికన్నంబు యిడకలేక। గోవు యిచ్చునంత గొప్పచూపి।
మాయచేసిపంపి యాదారిలనిపించు। కుటిలదాతకిట్టిగుణము రామ॥

౨౬. గీ॥ వినెడివారికి కల్పనలకు మైమఱ్ఱించు। కన్నవారికెరుక గాంచఘనము।
విననికసనివారికివ్విధంబెరుగింప। యెలుగుకగ్నిచూపునట్లు రామ॥

౨౭. తే॥ అడగి తెలుసుకొనుటయవనిలో ధర్మంబు। చూచి తెలుసుకొనుట పూటి జగతి
తనకదాటెలియనగు తత్వగోచరుడిలను। రామరామ సార్వభౌమరామ॥

౨౮. క॥ చెడుఘనులనడుసుగట్టుల। పెనతిరిగిన పోతులెదుట పెద్దలయెదుటన్।
బడుగయిన నరుడు నిలచిన। చెడుదలకగుగాక మేలుచెందదు రామ॥

౨౯. తే॥ ఎదుట దెలియువాడు వేల్పుదాసనబరగు। తన్ను తెలియువాడు దాతయగును
కాలమెఱిగినవాడు ఘనయోగనిపుణుడగు। రామరామ సార్వ॥

30. తే॥ పెట్టునిల్వ యంతపేవకైన వసుధరణి। కొట్టునిల్చు మరియు కొంతవరకు।
మాటనిల్చు నుయుగము మారినాతెప్పకను। రామరామ సార్వ॥

3౧. తే॥ కలసి తెలియరాదు కైలాసపతికయిన। తెలసికలియరాదు దేముడైన।
కలసి తెలసిన పిదప గర్భమలినంబగును। రామరామ సార్వ॥

3౨. తే॥ వగవరాదు యిచ్చి వైభవంబయినను। తగులరాదు తా వుతరమిగనక।
నగవరాదు సభల నధికారులెదుటను। రామరామ సార్వ॥

33. తే॥ పట్టివిడువరాదు బ్రహ్మాదులెదురించ। విడచి పట్టరాదు వీరుడైన।
పట్టికట్టి గొట్టి యదుట నిల్వగనగునె। రామరామ సార్వ॥

3౪. క॥ తలబరువు చెట్టువాయువు। వలనన్ ధరడొల్లు రీతి వసుధాస్త్రలిలో।
తలపొగరు దుర్మదాంధులు। నిలగూలు మసాధువలన నిజ్జముగ రామ॥

3౫. తే॥ ఘనులు ఘనుల మెచ్చు ఘనచర్యలను జూచి। ఖలుడు ఖలుని మెచ్చు ఘనుని గనక
ఖరము శేవుల మెచ్చు ఘనసభలు మెచ్చునా। రామరామ సార్వ॥

3౬. తే॥ ఘనుల జేరి ఖలుడు కడుకాచుకొనియుంట। తాను బ్రతుకు దలకె తలపగాను
కప్పకాలుకొరకు కాకంబుగాయదా। రామరామ సార్వ॥

3౭. తే॥ ఆసతేత భూమి సావరించిన లేక। గాసి తెంది పీద పక్షానిగాగ।
నీటిప్లైలునకొంగ నిలచి కదిలాడునా। రామరామ సార్వ॥

3౮. తే॥ ఘనులయొద్దను చేరి ఖలుడు పూర్తిగనిక్కి। యితరఘనుల నొంపనిశ్చయించు
గాలునెక్కి దన్న గగనమునకమురునా। రామరామ సార్వ॥

## దృష్టాంతశతిపద్యములు.

౩౯. గీ॥ పేరులేనివారిపేరోలగము జేర్చి। గొప్పజేసినల్పగుణము జూచి।
వగచిమాన్పగతనకు వశ్యమాధరలోన। ముందు దెలియరాని మొరటురామ॥.

౪౦. గీ॥ అష్టకష్టపడియునార్జించిధనమెల్ల। తినక పేదలకునుతిరిపమిడక॥
వడ్డికిచ్చుచుచీమవలెకూడబెట్టువా। డధమజనులకధముడండ్రురామ

౪౧. తే॥ క్షేత్రమెరిగియిత్తుజగతిలోనుంచవలె। పాత్రమెరిగియీవిబరుపవలయు।
సూత్రమెరిగిపనులసోధింపవలయును। రామరామసార్వ॥

౪౨. తే॥ జ్ఞానిమంచిగుణముపూనిమాన్పగదలచి। బాధజేతురవనిపాపులగుచు।
కమతమణగుటెగాక కరిగికనకముచెడునె। రామరామసార్వ॥

౪౩. తే॥ నీచదశచెఘనులునిరువాడవితానొక్క। నీచసభలకొదిగినిలచుటెల్ల।
గలియరాడదిమాయగనుటకోయక్కరకో। రామరామసార్వ।

౪౪. గీ॥ ఘనులనెపుడుచెరుపగాఖలుండునుకోరు। కోరరటులఘనులుకోరనేని।
అగ్నిలోనవైచునాహుతిరీతియై। భస్మిగాడెఖలుడుబరగరామ॥

౪౫. తే॥ ఖలుడుగొప్పపనులక్రమమెఱుంగకజేయు। ఘనులుచేయరట్లుక్రమములేక
కుక్కనడచినరీతికుంజరమునడుచునా। రామరామసార్వ॥

౪౬. తే॥ బదులుపలుకనివారిభావంబునొప్పింప। తానెనొచ్చుపిదపతథ్యముగను।
బరగభాస్కరుమీదబరపుఘూశేమగును। రామరామసార్వ॥

౪౭. తే॥ నీరులోనిపాలునిపుణతోగ్రోలెడి। హంసశ్రేష్టమనదుయవనికొంగ।
చదివినాతనుమూఢజనుతితోసామ్యమె। రామరామసార్వ॥

౪౮. తే॥ బాగుజేయువారుబాయరెంతయునొచ్చి। చెరచువారుకలియ చేరరెపుడు।
కడకువచ్చుమృత్యువగలననిముందనునె। రామరామసార్వ॥

౪౯. తే॥ తానుయుండితినకతగుబీదలకునిడక। యితరులివ్వచూచియిష్టపడక।
వగచిలోభినష్టపడుమూడువిధముల। రామరామసార్వ॥

౫౦. తే॥ జనములంతయొకటిజ్జేనుభేదములురెండు।ఘనులునీచులనెడిక్రమముగలదు
కన్నతగులుతావుగని సంచరింపనగు। రామరామసార్వభౌమరామ॥

౫౧. తే॥ మధుమక్షికలదోలిమదునొందిసంయ్యాసు।నటులవ్యాఘ్రఘనసఖములందనగునె
యలవిగానిపనులయమరించ చడనగునె। రామరామసార్వ॥

౫౨. తే॥ గోమూత్రమునుపట్టి కోరిద్రాగుదురవని। యటులగోమయంబునప్పుద్రాచ
మనసునొప్పటయొకటెమలినంబులొక్కటె। రామరామసార్వభౌమరామ॥

౬౭. తే॥ మతిసెతంగనిజారిమరిచేర్చగారాదు। చేర్చిమర్మమరయ చెప్పరాదు।
చెప్పితాకలహింప చెడుసిద్ధమయ్యెండు। రామరామసార్వ॥

౬౮. తే॥ నాగుబాములబట్టినవలీలవారియించు। గరుడిపుట్ట మీదగనకవాల।
తానుపట్టునదియుతెనుపట్టుతలమహిమ। రామరామసార్వ॥

౬౯. తే॥ మగువమహిమలోకమంతనిండియునుండె। మగువనొంచ సేనిమాన్యుడగును
మగువబొందదేనిమరి బహ్మావేత్తగు। రామరామసార్వ॥

౭౦. తే॥ వడ్డియాసచేతమొరులకునప్పిచ్చి। నమ్మికార్యమందునాత్రబడుట।
బుద్ధినమ్మియు వేటపాలుపారదిగినట్లు। రామరామసార్వ॥

౭౧. తే। రాజులేనికోటరథసంబుగలనీట। కాపుగలుగుతోట ఘనులకెదుట।
అండలేనికోటనుండరాదిలయందు। రామరామసార్వ॥

౭౨. తే॥ పెద్దలేనియూరుపిన్నలేమిడియిల్లు। సుద్దిలేనిమంత్రమూత్రక్రియలు।
హద్దులేనిశిష్యులవనిపయ్యవిప్రథా। రామరామసార్వ॥

౭౩. తే॥ చెడ్డకార్యములనుచేసి యవరెతగరని। దాగియుండిపొంచుథవణిమీద।
కండ్లుమూసియుపాలుఘటమందుపిల్లిగతి। రామరామసార్వ॥

౭౪. తే॥ అల్పులాడుమాటలవిలెక్కకేరావు। ఘనులమాటనిజముకాకపోదు।
కొంచపాటిమాటకొంపలుముంపనగు। రామరామసార్వ॥

౭౫. తే॥ కాపులేనియూరు ఘనముఖులులేనిసభ। డాపులేనిధనమూదర్పనండ।
చూపులేనిరూవుచూడనిష్ఫలమగును। రామరామసార్వ॥

౭౬. తే॥ గజముతేగుదారి గానంగలేకను। యలుకబోవుకంతవెతకినట్లు।
అల్పతప్పులుబట్టిఅధముండుతుళ్ళనగు। రామరామసార్వ॥

౭౭. తే॥ లోభిఘనునకైనలోభంబుదీర్తునని। కాసులిచ్చిలెక్కగరపుచుండు।
శష్పమొక్కటిగాల్చిచేలకెరువిడినట్లు। రామరామసార్వ॥

౭౮. తే॥ తానుసద్గుణుడైనతనకంతసద్గుణులె। దుష్టుడైనతనకు దుష్టులంత।
సుగుణుడైనయితరసోధనతనకేల। రామరామసార్వ॥

౭౯. తే॥ కొమ్ముగాండ్రపెట్టుకొండనైననుచూచి। శిష్యామట్లుకనరుచేయదేపుడు।
అల్పుడాగ్రహించనధికుడుగ్రుండగునె। రామరామసార్వ॥

౮౦. తే॥ మానుమానురాచి మరియగ్ని పుట్టించి। మానుక్రింతియలముమసినిచేయు।
అధికులటులపోరియధములగాజేయు। రామరామసార్వ॥

౮౧. సీ॥ అందరికినిచూడసాధారణమగు। నధియుజాతిగుర్తుయధికమునకు।
అందరదినిచూచి నపహాసింతురధరము। శిగ్గుశృంగారమైజనదేరామ॥

౮౨. తే॥ ధనము హెచ్చుగలుగ తాదినునప్పిచ్చు। కులముగలుగ హెచ్చుకులమునందు।
గుణముహీనంబయినకులధనములబ్బునా। రామరామసార్వ॥

౮౩. తే॥ చెడునుమంచియనుచు చేకూర్పగారాదు। మంచిని చెడుగనుచు మనుపరాదు
విషచినుములగురీతివివరింపనగుజగతి। రామరామసార్వ॥

౮౪. తే॥ ఘనులు నీచులచేర్చిగలఖ్యాతిపోనాడి। నీచఫలము తాను నిర్వహించు।
పాచిపట్టిననీరుపద్ధతినొప్పారు। రామరామసార్వ॥

౮౫. తే॥ పెంటకన్నరోతనంటలేవేలేవు। కంటికన్నమృదువుగాంచలేదు।
కపటికన్నపాపఖలుజడుండునులేడు। రామరామసార్వ॥

౮౬. క॥ మూషకబలములగమగొని। రోషంబునుదాచిపిల్లిరూఢిదలిర్పన్।
భేషనుచుపొంచురీతిన। దోషులగనిమెచ్చిఘనులుదొలగుమరామా॥

౮౭. తే॥ కప్పకాలుకొరకుకొకిసస్నానమున। తపముచేయునటులదాగియుండి।
కాలుచిక్కనపట్టి ఘాతచేసినరీతి। మూర్ఖుడొకనికాచికొనుటరామ॥

౮౮. సీ॥ గొఱ్ఱెకుతికబట్టుకొనియునుతోడేలు। తోకదిప్పినూకదొట్రుపడుచు।
దానికన్నముందుధవుడుబెట్టినరీతి। మృత్యుజాడలెవకుమూర్ఖరామ॥

౮౯. తే॥ నీచునీచముమెచ్చి యిలకిదేఘనమన। ఘనులుచూచిదానిఘనతదనునే॥
కుక్కమెచ్చినదరసి కుంజరముమెచ్చునా। రామరామసార్వ।

౯౦. సీ॥ కర్కటంబునెరియగనియుజంబూకంబు। బరగిబరగిపిత్తిథంగపెట్టు।
గనుడిక్రృష్ణాయనినకర్కటుమొనవునా। అధములధములకొగ్గబడరేరామ॥

౯౧. క॥ కలహాయతప్పజేసిన। బలవంతులుమెచ్చువానబలుమెప్పగునా।
యిలపేపలట్లుచెపిన। తలవంపులుజేతుంతెని దపయకరామ॥

౯౨. క॥ నియపేదకిడినదానము। కరమర్థియుగొనియుదానిఘనతయొనర్పున్।
నెరధనికుకిడినదానము। కరమొగ్గిత్వణీకరింపగల్గునురామా॥

౯౩. క॥ నీచులకువిద్యగలిగిన। నీచంబునమెరయుచుండునెరఘనమగునా।
గోచినజల్తారమరిన॥ తేజంబనితలకుపాగచిత్తురెరామ॥

౯౪. గీ॥ కాలగతివల్లసందర్భఘటనవలన। నారకేళంబుదొరకిననాత్రపడిన।
కుక్కకబ్బునెటెంకాయకువలయమున। నీచుకగుమేలునీరీతినెగడురామ॥

౯౫. తే॥ పాలు రేదిగివచ్చి పనికొచ్చినారమచు। తల్లిదండ్రిమరియుఁదరణిమీవ।
నదియాయుక్షీణమగుననితలబోయరో। రామరామసార్వ॥

౯౬. క॥ కలవాయచెప్పకొరకిన। బలవంతులుకొరకిచూచిబల్రుచియనెపిడ।
యిలపేదలటులచేసిన। తలకెక్కినదండ్రుపిచ్చిదపయకరామా॥

౯౭. క॥ కూర్మియుడుధనికుండైనను॥ వారుణినిరుపేపలయినవలపరువేపడ।
ఘోరఫణిమందుమణిగని। చేరునెనరులపరిభీలిజనకనురామా॥

౯౮. గీ॥ కొండతోడపోరుకొనియునుపొట్టెలు। తగులుచుండుఘోరపాట్పమునను।
కాలమెరిగితగులఘునగిరిపార్శ్వదా। కాలమనుసరించుఘనులురామ॥

౯౯. తె॥ రుచులమెలగుజిహ్వరూపింపగాలేక। యంత్రచీమప్రషణమెతికఫుట్టి।
నటులఘనులోభంబునధముండుబట్టనగు। రామరామసార్వ॥

౧౦౦. గీ॥ విషమువిషముగాకవిశదమౌసునయము। సునయముసునయముగాకసోమవిషము।
యబ్ధిఁదచ్చునపుడుయథపురాక్షసులకును। కాలకర్మగతులగాంచరామ॥

౧౦౧. క॥ నీచులకుప్రజ్ఞకలిగిన। నీచంబునమెయియుండానసెఘనముగునా।
పొచ్చప్పునున్నతగవము। యోచినమరియొక్కపనికినెసగునెరామా॥

౧౦౨. గీ॥ గంగచేతచలిక గడగడవణకెడు। శిముడుచెంద్రుచేర్చిచలగతేని।
విషపుకాగమెలగి విశ్వంబుగాయడె। ఘనులమేలుసునకాపురామ॥

౧౦౩. తె॥ అంతదెలియువారయవనిసర్వజ్ఞులగు। కొంతదెలియువారుకొంచెతములు।
యేమిదెలియనివాని యూవిరాట్టనపగుమ। రామరామసార్వ॥

౧౦౪. తె॥ నాగవిషమునకిరుపుశాగారుడంబుదె। పరగపాషాణముకుపత్రియుండు।
సాధువిషమునకిరుపుసాధింపగారాదు। రామ।

౧౦౫. క॥ దుష్టునకుదర్పమమరిన। దుష్టతచేచెడునుమేలుచొరకకధరపై।
దుష్టోరగంబుబుసగొన। స్పష్టమగుక్నుచణమునకు జగతినరామా।

౧౦౬. తె॥ సాధుసజ్జనులకును సౌఖ్యమమరగనోప। జ్ఞానిఠోనుదుష్టచెయపునెపుడు।
సర్వజ్ఞుడీరెండుసర్వపాపోరనగు। రామ।

౧౦౭. తె॥ అవనిభోగులిపుడుయతిపుణ్యులేమునుపు। పరగకష్టులిపుడుసాధులపుడు।
యిపుడుజ్ఞానులయినయికభోగపుణ్యులగు। చేసినంతగాదెజగతిరామ॥

౧౦౮. తె॥ వాదితెలియుచర్యవలయునంతకుజాస్తి। వాదితెలియుతనరూపలయుకెమ్మి
చెర్చదెలియుసాక్షి చెప్పినంతకునిజము। వాదదెలియునంతమహిన్నిరామ॥

౧౨౩. తే॥ నీటిలోనమునగి నెరస్నానులగుచుండు। బ్రతికిమంటిమునగ బడరుధరణి।
మంటిమునగినందుమాట్లాడ దైవమగు। రామరామసార్వ॥

౧౨౪. తే॥ మేలుకన్న కీడుమేదిని ముందొనరు। కీడుకన్న మేలుగూడుముందు।
హెచ్చువెనుకయ్యుండుహీనంబుముందమరు। రామరామసార్వ॥

౧౨౫. క॥ సత్యమునవాయువృద్ధగు। సత్యముదయలమరె నేనిసదయుండునగుౘ।
సత్యముదయశాంతముగల। నిత్యుం డెసకలమునకునిజూడగురామా॥

౧౨౬. తే॥ పుట్టినిల్లుగాల్పపుణ్యమెసిద్ధించు। యున్నయిల్లుకాల్పకొనకముందె।
పుట్టినిల్లునెంచిపూజింపధర్మమగు। రామరామసార్వ॥

౧౨౭ తే॥ వైభవంబుగల్గువినినమానవులకును। శత్రుజయముగల్గుచదువరులకు।
మంగళంబమరునీమార్గానువర్తులకు। రామరామసార్వ॥

౧౨౮. తే॥ అవనియందునగుంటూరి వసతినున్న। వంగవోల్ శీమయండ్లూరివాసు
యరయనెండ్లూరికోటయాఖ్యాప్రణీత। రచితమిదిచూచిగొనుముశ్రీరామ॥ (డెయిన

తే॥ అవనిసాధారణాఖ్యసంవత్సరమున। పుష్యశుక్లమసంక్రాంతిభోగియందు।
నరయద్రుష్టాంతనీతిశతకంబునమర। రచితమొనరించెగనుముశ్రీరామరామ॥

శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ శ్రీరామార్పణమస్తు.

అర్పణ-యోషధీగణనిక.

౧. క॥ మురిపిండిపళముకొంగున। ధరియించినసందుతొలగుబాలింతలకుౘ॥
ధరదానినాగవల్లిన। బురడించినజాడ్యమొదలుపోలతికిరామా॥

౨. తే॥ అత్తిబిత్తిమూలమాభరణితాళను। స్వక్రమమునతీసిచేర్చియున్న।
వస్యమగుమానవులునొదలుభూతములిలను। రామరామసార్వ॥

౩. తే॥ శైవభూమినీలిచెలిరక్తకాశేరి। బాధలణచుదర్భిభానులందు।
చెట్టుఖండింపవలెశాస్త్రసమ్మతముగను। రామరామసార్వ॥

౪. క॥ కరిశృంగవృక్షమూలము। ధరిశార్ద్యలపూజదీర్చిధరియించినయా।
నరుబాసిబ్రహ్మరాక్షస। వరభూతములాణకిబారువసుధనురామా॥

౫. గీ॥ దర్భిభానులందుతగుపూజలొనరించి। పిండిబెండవేరుముండదీసి।
యరిదుకడియముచేసియదినుంచిధరియించ। మగువఛిందుబిందుమానురామ॥

౬. గీ॥ ధవళగురిగింజమూలంబుదర్భిభాను। లందుక్రమునతీసికడియమునచేర్చి।
చేతధరియించిననుసాతిఛిందుబిందు। నొదలిమఖసంతుగననగునువిదరామ॥

౭. గీ॥ కడపచెట్టువేరుకలెగల్పి పాంగ్రాణి। ధూపమిడినతొలగుదురితపీడ।
ధవళవెంపలివేరుదాల్చిన మోహినీ। కామినీగ్రహములుకనలు రామ॥

౮. క॥ కరిగురిగింజమూలమును। దరిశార్కులసుద్ధిచేసిధరియించినయా।
నరుబాసికలభూతము। లరచుచుధరబారువెనుకనరయక రామా॥

౯. క॥ కరికందస్రక్రమంబున। దరిశార్కులదాల్చె నేనిదయ్యములాదటన్।
కరిగంధకంబునటులను। ధరియించినభూతపీడదలగును రామా॥

౧౦. తె॥ పావురాలరెట్టపాకశుద్ధిగతినిన। భామముట్టుశూలబాపిధరణి।
గర్భమమరదాల్చికడుపుత్రవతియగు। రామరామసార్వ॥

౧౧. గీ॥ కాకిరెట్టమేలుగలిగించుమిథునమ్మునకు। కాకిరెక్కవైరగతులజేయు।
కాకివలననుశత్రుగర్వమణపగదగును। కాకిలోకమేలుకారి రామ॥

౧౨. క॥ ఖగపాదవృక్షదళమున। నగములుకల్లోలమందునతిరభసమునన్।
మగువలవశ్యంబగుతెరు। కగువల్పిలమేలుకారిగదశ్రీరామా॥

౧౩. క॥ కలెగొట్టుమూలమిలపై। య్యాలఖరమాత్రమున నూరి హస్తాస్వదుడై।
బలునగ్ని జ్వాలలాదవిన। మలయంబైతోచు వేడిమసలక రామా॥

౧౪. క॥ శ్వేతార్కమూలవలుపిల। ఘాతకులిడుమర్గమందుకరిగించుధరన్।
చేతానుపానములచే। వాతపుచపలంబునణచువసుధను రామా॥

౧౫. క॥ కాసరగడ్డనుకలితో। భాసురముగనూరినూనెబరపియుగ్రోలన్।
గాసిల్లిచెడినపిండము। దూసుకపడుగర్భపట్టుతొలగియు రామా॥

౧౬. తె॥ వేపచెట్టునలక్ష్మి వెలయునెల్లప్పుడును। కల్లగాదునిజముగాంచరాదు।
నల్లపూతవేపనమృతోపమానమగు। రామరామసార్వ॥

౧౭. గీ॥ కీశవల్లివిద్యకీశుడై విత్రించు। కీశవల్లిజ్ఞానకీలు దెల్పు॥
పుట్టకీశవల్లిపుడమిజనవశ్యమగు। కీశవల్లివాయుకిరుపు రామ॥

౧౮. పాలతిగర్భమునణగించుపుట్టతంబ। యల్లవాకుడుగర్భంబువెలయజేయు।
జ్ఞానమరియించుతంగేడుక్రమముగాను। మత్తుమరుపులభారతిమాన్ప రామ॥

౧౯. క॥ చీటికేశ్వరాకురసమున। ఘటియించియుపంచదారకల్పియుమరిదా।
గుటికలునుమూడుమ్రింగిన। మటుమాయంబగునుమర్లమందిల రామా॥

౨౦. గీ॥ ధాతమేడికాయదగ్గుమహరియించు। దానికల్లుమేహతపననణచు॥
దానిమూలంబిలనుదరిశార్కులనుతీసి। దాల్పశత్రుకదురుదాకు రామ॥

౨౧. తే॥ ఎదురుబజనికి పూనివిహరించుసాధునటు। చూచినట్టి శ్రుతసాక్షి చెప్పునటు
దానిమునుపటితీయుతరిగాఢబుంపనగు। రామరామసార్వ॥

## తర్పణజ్ఞానగణనిక.

౧. గీ॥ పూసకూర్చినటుపుటకాదులను తెల్పి। అభయమిచ్చిసత్యమురయచూపి।
తన్ను చూపిశిష్యతనువులోగనుమన్న। వానిసద్గురుడనవలయురామ॥

౨. గీ॥ మాటలాపనేర్చిమర్మంబులెఱిగియు। పూర్ణభక్తుడనగపొసగుచుండి।
శ్రద్ధలేకనుసేవజేయంగశిష్యులు। దొంగదాసరనగదోచురామ।

౩. గీ॥ ఎట్టిపనులనైనఘట్టిగావిడనాడి। యట్టిపిసికిబొమ్మలనురజేసి।
యిట్టిలోకమనియులనెఱింగినవాని। శిష్యసిష్యుడనగజెల్లురామ॥

౪. తే॥ గుణములేకముజేసిగురునితాలక్షించి। కనులుమూసివాయుఘటనపరచి।
గగనమందునగురునికళలెన్న లక్ష్యముగు। రామరామ॥

౫. గీ॥ లక్ష్యమనినను వెలిలోనలాఘవమున। లక్ష్యముంచుమెగురుశిష్యలక్షణంబు।
గురునియాజ్ఞనుగమనించుగురియుగుత్తు। గుర్తుకీలకమయ్యెందుకొనుమురామ॥

౬. క॥ గురుడుమహాత్మ్యుండయ్యును। పరశిష్యుడుతెలియనట్టివాడైనతొలిన్।
పరిపూర్ణభావమొనరియు। గురుశిష్యులుమేలుజెందుకుంభినిరామా॥

౭. క॥ గురుశిష్యులెపనుతెరనిడి। తెరదీసియుగురునిపూజచీర్చియుమరిదా।
తెరనుంచిగురునికనుగొను। పరశిష్యుడురాజయోగపరుడగురామా॥

౮. గీ॥ దయయుక్షమయుసత్యంబుధాత్మికంబు। మౌనమునుశక్తిసత్క్రియమంత్ర
మెఱుకసత్వమునిష్కరనీతితృప్తి। స్వచ్ఛతాక్రోధములుయోగసరణిరామ॥ (నిష్ఠ

౯. క॥ సత్యముదయలోగినదయుడు। సత్యశౌచమునుకూర్పసవృషియనసా।
సత్యముదయశౌచముగల। నిత్యుండెబ్రహ్మవేత్తనిపుణతరామా॥

౧౦. తే॥ ఉత్తరేణిగింజలోనరబియ్యముజేసి। యావుపాలనొండియారగించి।
ఆకలణచియుయోగమాచరింపగదగును॥ రామరామసార్వ॥

౧౧. క॥ మూడామైదింటినివిడ। నాడియునారింటమెలగియారొదలియుచా।
జోడుగనిపదిటనొక్కటి। కూడినవాడగునుమోక్షకుంభినిరామా॥

౧౨. తే॥ అటులచేయలేకనవనిదాసత్యమే। మార్గమనుచునెంచిమతినిదైవ।
భక్తియుండినవాడుపరమార్థయోగులగు। రామరామసార్వ॥

